# ఉపోద్ఘాతము.

చదువరులారా,

ఈచిన్నిపొత్తమునందుఁ జర్చించినభారతకథాయోగములను దిలకించి యిదేరీతి నందందుఁ గలభారతవిశేషములను మీహృదయముల కెక్కించుకొనఁ గోరుచున్నారము. అంతియకాని మనకుఁ గలస్వల్పానుభవములో నాంధ్రకవితాలతాలవాల మగువాగనుశాసనునిప్రయోగములకు వంకలు పెట్టి గొప్ప గడింప నెంచుటకుఁ బ్రయత్నింపకుందురుగాక! నేఁటివారిలోఁ గడుంగడుఁ బెద్దలును విద్వత్కవివరులును నగునొకరిట్టిపనికే వ్రాయుచున్నారు. వారివ్రాఁతయందలి యసారతనుగూర్చి మా పురశ్చరణమున 8 వ పుట మొదలు 9 వ పుట వఱకును గొండొక చర్చించి యయ్యెడ నీపొత్తమునవిశేషించిచర్చింతుమని తెల్పియుంటిమి. కాని యిటీవల వారును మేమును ఏలూరిలో శ్రీరాజామంత్రిప్రగ్గడభుజంగరావుబహద్దరు జమీందారువారిసన్నిధిని జాల సారులు కలిసికొని కొన్నిదినములొకచోటనే వసించుసందర్భము తటస్థించుచు వచ్చినది. అప్పుడు వారు వ్రాసిన 'భారతఫక్కి' లోనికొన్నివిషయములం జే మాటాడుకొంటయు,

వారేవో కొంతవఱకు సమాధానము చెప్పుటయు దాని పై మరల మేము ఖండించుటయుఁ బిదప వారు మిన్నకుండవలసివచ్చుటయుం బ్రాప్తించుటచే మగల నావిషయములనే యిందెత్తి విస్తరింపక యుపేక్షింపగలసిన వారమైతిమి. ఆంధ్రమహాభారతము సంస్కృతమునకు "మక్కికిమక్కి" తెలుఁగు కాదు, అనువిషయమును మన మాక్షేపింపరాదు. ఏమందురా? గ్రంథకర్త లట్లు ప్రతిజ్ఞ చేసియుండలేదుగదా? వారు కథాప్రధానముగాఁ దెలిఁగించిరి. నారేయనసేల భాస్కరాదులుఁగూడ నట్లే యాంధ్రీకరించుచువచ్చిరి. ఇటీవల నవఁగా నిన్న మొన్నటినుండి యీ "మక్కికిమక్కి" ప్రకరణ మారంభమైనది. దీనింబట్టి మాయాక్షేపణలకు వారుత్తరవాదు లెట్లగుదురు? మఱియుఁ గొన్నియెడల సంస్కృతమున నొకవిధముగా నుండఁ దెలుఁగున వేఱొకవిధముగానుండుటయుఁ గొన్నిచోట్ల, దానికిఁ గేవలవిరుద్ధముగా నేయుండుటయుఁ గలదదియేని మాక్షేపణీయము కాదా? యందురేని అయ్యదియు నాక్షేపణీయము కాదని మా యాశయము. అన్యభాషానువాదకులకు సంస్కృత భారత మన్వయించుకొనుపాటిసాహిత్యముకూడ లేదని వాదింప నేప్రాజ్ఞునకు నోరువచ్చెడిని! కావున నాభేదములకుఁ గారణము కొన్నిచోట్ల వారిబుద్ధిపూర్వకముగు

మూర్ఖునియొ మఱికొన్నిచోట్ల వ్రాయసగ్రంథములయం దుండెడిపాఠభేదములనియు నే మూహించుచున్నార ము. సంస్కృతాంధ్రభారతములకుఁ గలవ్యత్యాసములు కొన్ని మాభారతసాటకపీఠికలలోఁ జూపి యున్నార ము. అవి యందందుఁ జూతురుగాక. ఇంకఁ దిక్కనరచన లోనివిశేషములను నేఁటివా రన్యథాకరించి కొన్నిటిని బునరుక్తులుగను మఱికొన్నిటిని పేలవతెలుఁగుదోసఁ గులుగను బోల్పఁజూచుట "మాతా మేవంధ్యా" అను లోకోక్తిఁ బ్రతిఘటములగుటకుం జేయుప్రయ త్నమే కాని వేఱొండు కాదు. అవి దోషాభాసములు గాని దోషములు కావు. 'భ్రాంతేః పురుషధర్మత్వాత్' అనునుక్తింబట్టి వ్యాసాదులుగూడ మనుష్యమాత్రులే కావున వారుగూడ భ్రాంతివశమున నెచటనేని దోసఁ గు పొసఁగించి యుండవచ్చు ననువాదము యుక్తసహ ము కాక పోదుగాని వా రల్లెక్కడనేని భ్రాంతిపడి యున్నను వారితోటిమహాకవు లనేకు లాభారతమును సంస్కరించి యుందురు గాని యట్లే యుంచి యుండ రుగదా! అట్టిస్థితిలో వ్యాసమహామహు లనేకులు సం స్కరింపఁగాఁగూడ నిప్పటివారికింగొన్నిదోసఁగులు నిలి చియుండు ననిపాటింపఁ జూచుట సాహసమాత్రము కాక మఱియేమి? అవి యెప్పటయేని యరుదుగాఁగూడఁగాక ప్రతిపదమందును గల తమరీతిని వ్రాయఁజూచుట మతి

యును సాహసము. ఇట్టివానికెల్లఁ ముఖ్యకారణ మస్మదాదులకు భారతకవిత్వమునందలి రచనావిచ్ఛిత్తిని కనిపెట్టఁ దగినంతయనుభవము లేకపోవుటదక్క వేఱు కాదని చదువరు లూహింతురు గాక. పాండిత్యము వేఱు అనుభవము వేఱు. వేయేల భారతమున లేఖకప్రమాద ప్రయుక్తము లగుదోసఁగులే లేవని యుండిన నున్నవేమో కాని యంతకు మించిన దోసఁగు లేవియును లేవని మేము నమ్ముచున్నారము. 'భారతఫక్కి'లో నట్టిలేఖక ప్రమాదములం గుఱించి ప్రసంగించినట్లు తోఁచదు. కేవలము భట్టారకునిమీఁదికే దండెత్తినట్లు స్ఫురించును. అట్టిస్ఫురణములఁ గొన్నిటి నుదాహరించుచున్నారము.

(భారతఫక్కి 42 వ పుటనుండి)

(1) ఉ॥ ... భీముఁడు మల్లవిద్యనే ర్పేర్పడఁ
గా హిడింబు బలహీనపరాక్రముఁ జేసిఁ
జెచ్చెరన్" బల = ఉక్కు, పరాక్రమ =
బీరము, హీనబలపరాక్రమము, అని భావ
ముచేసికొనవలయునాకో, యతికొఱకు
హీనశబ్దము, బలపరాక్రమములనడుమకు
వచ్చినది గాఁబోలు!

ఇది యేటివిమర్శనము అట్లనుకొనుటకున్న, బలహీ
నమైనపరాక్రమము కలవానిఁగాఁ జేసె నని యథా

చరిత్రముగానే యేల యన్వయించుకొనరాదు? ఈయన్వయమునందు హిడింబునకు బలము వహించిన భీరము మాత్ర మింతను తగ్గితే దనుపారశ్యముగూడఁ గన్పట్టి 'చింత చచ్చినను పులుసు చావలే' దనులోకోక్తి కది సార్థకము కావచ్చునుగదా? కవిగారికయ మిటులుండ దాని నన్యథాకరించి యతికొలుకనియుఁ బ్రాసకొలుకనియు వెక్కిరింపులు శోచనీయములు గాక మఱెట్టి వగునో?

(భారతఫక్కి, 44 వ పుటనుండి)

(2) క॥ ... మతిగాని। త్కృతమున కగ్గలముగను।
త్కృతి చేయుట యుత్తమంబు కృతబు
ద్ధులకున్" సత్కృతి యనుచో నుప
కృతి యన విస్పష్టము.

సత్కృతియనఁగా, గౌరవము. ఉపకృతి యని యుపచర్యముగాఁ బరిణమించుచుండఁగా సత్కృతియని యే వ్రాయుదలచునోటు?

(భారతఫక్కి 45 వ పుటనుండి.)

(3) ఆ॥ వె॥ సతి విముక్తయైనఁ బతికిఁబునర్దార।
సంగ్రహంబు నేఁత శాస్త్రమతము।
పతి విముక్తుఁడయిన సతి కన్యపురుష
సంగ్రహము నేఁత లోకగర్హితంబు"

శ్లో॥ నచాప్యధర్మః కళ్యాణ బహుకల్పే
కతా న్నృణామ్। స్త్రీణా మధర్మ
స్సుమహాన్ భర్తుః పూర్వస్య లంఘనే"
సంస్కృతమునకుఁ దెలుఁగు సరిగా నున్న
దో లేదో పరీక్షింపుడు.

ఆంధ్రీకరణకర్తృసక్తి మొదల సమర్థకమందరలయందుం గాని భట్టారకుని తెలుఁగు సరిగానే యున్నది. 'సరిగా' అనుపదమునకు 'మక్కీకిమక్కీ' యని యర్థము చేసికొనఁ గూడదు. భంగ్యంతరముగా రచించుట భాషాంతరీకర్తలసమయము. అంతమాత్రమున నదిమూలము నుల్లంఘింపదు. విస్తరభయమునసరము.

(భారతఫక్కి, 47 వ పుట నుండి)

(4) తే॥ గీ॥ పీఁచు పుట్టినపదియవనాఁడు"
"శ్లో॥ జాతమాత్రః పురా చైవ మమాంశా
త్పతితో గిరా" భేద మరయునది.

పుట్టినతోడనే తొడనుండి పడుట యసంభవము గావున భట్టారకుఁడు జాతమాత్రపదమున కట్టియర్థము ను గైకొనియె ననుట సహృదయైకవేద్యము. ఏల యసంభవమందురని యనుఁడు, వ్యాసప్రసూత యగు ప్రసవిత్రి

రూఢికెక్కఁగొనంత కాల్యాలో నుండదు. అప్పు డా పా యుటీరలంబో లేఁ దనయంత మును బాలునిడికొని కూర్చుం డుట యసంభావనీయము. కావునఁ గొంత గడు వొసఁగి భట్టారకుఁడు తనకుం గలలోకజ్ఞతను వెల్లడించెను.

(భారతఫక్కి 47 వ పుటనుండి.)

(5) తే॥ గీ॥ బ్రాహ్మణులకుఁ బ్రియము వాయక
చేయుంగఁ, గాన్పునూవె పుణ్యకర్మఫలము"
వాయక = విడువక. ఇది వ్యర్థమును గర్మ
క్రియల నడుమనుండి యపార్థము నై
యున్నది.

వ్యర్థ మనుకొన్నచో నాతపము వ్యర్థము గాని సార్థక మనుకొన్నచో సార్థకమును నగును. "బ్రాహ్మణులకుఁ బ్రియము చేయుము. బ్రాహ్మణులకుఁ దప్పక ప్రియము చేయుము." అట్లును నిట్లును గూడ నుండ వచ్చును. అది కవివివక్షాధీనము. కర్మక్రియలనడుమ నితర ముండఁగూడ దని శాసన మేదియును లేదు. అపార్థము చేయ నెంచుచో రానిచో పెయ్యది? కావున నాయీశంకలు చొప్పదంటుశంక లనక తప్పక వచ్చుచున్నయది·

(భారతఫక్కి 48 వ పుటనుండి.)

(6) కనకశైలనికుంజంబును బోని వానివతము"
పోని = పోలిన, పకారాదిత్వమో, బకా
రాదిత్వమో, అనిర్ణీతము.

అనిశ్చితమే యగునెడల "పోని- పోలిక" అనిమాత్రము విమర్శకు లెట్లు వ్రాయఁగల్గిరో కదా!

(భారతఫక్కి 48 వ పుట నుండి.

(7) సవ్యాపస్త్ర దక్షిణ కరమ్ములఁ గటికంఠ ప్రదేశములు పట్టికొని" సవ్యదక్షిణకరమ్ములనరాదా?

పేర్కొను కుడియెడమచేతు లనరాదాయని ప్రశ్నించి యందులకు హేతువుగా నిది తెలుఁగుగాన నచ్చ తెలుఁగుపదమే వాడుట యుక్తమన్నచో గతియేమి? ఇవి యేటికొంకలు? కుశంకలు.

(భారతఫక్కి 49 వ పుటనుండి)

(8) అసాధ్యబలుఁడు, అపారబలుఁడు" అన మేలు.

ఇప్పుడు వచ్చిన కేదేమి యున్నది? అపారమైనది యెయ్యది సాధ్యము కావచ్చును. అసాధ్యమనుటలో విశేషము కలదు గదా? అదిగాక యిది యేటి దిద్దుబాటు? చాలుఁ జాలు, ఇఁక నీ భారతఫక్కిలోని శంకలయుపారతం గూర్చి కాగితములు నమ్మువరుపుట యేల? దీనివాలకము జూచిన నిది సర్వవిధముల నాక్షేపణీయతఫక్కి మార్గప్రదర్శినిగాఁ గన్పట్టుచున్నది. శ్రీశాస్త్రిలవారు మొదట నీ 'ఫక్కి' రచించి ముద్రణమునకుఁ దమ

కడ కంపఁగా దీనిని నిరసించఁగాఁ శ్రీనాథుని వాం(డాశ తస్సైని రచించియుండఁడు అని యిప్పటికి విస్పష్టపడినది. ఇంతవఱకు మన్నశాస్త్రులవారిసాహాయ్యమున్నప్పటి శిష్యులు కంఠోక్తిగా వ్రాసినను కొందఱు నమ్మకము చాలదనుచు నుండెడువారు. వార లిప్పటి «భారతపత్రికలోని దానిని సంపఠించి మాముకొన్నచో దీనిమొగము చెప్పక చెప్పినట్లు ఉపకరింపఁగలదు. ఈరీతి విమర్శనములు పూర్తిగా నవావరణీయము లనుటకు మా 'పత్రిక' పుట్టుపూర్వమే పుట్టి ప్రకటితమై యుండు పునర్ముద్రితముగను వచ్చి యున్నమా «అపూర్వకవితావివేచనము" వలన విస్పష్టమే కాన మరల నదే విషయము కొత్తి చర్వితచర్వణ మొనర్పక ప్రస్తుత మింతటితో ముగించుచున్నారము.

తిరుపతి వేంకటేశ్వరులు,

శతావధానులు.

శ్రీమత్పరదేవతాయైనమః

# భారతవిశేషములు



## 1. ధారాశుద్ధి

శా॥ విద్వన్ముఖ్యుఁడు ధర్మమూర్తి త్రిజగద్విఖ్యాత తే
జుండు కృష్ణద్వైపాయనుఁ డేగుదెంచి సుతశిష్య
బ్రహ్మసంఘంబుతో। సద్వంద్యుండు సదస్యుఁ
డయ్యె ననినన్ శక్యంబె వర్ణింప సా। ధ్వాద్విష్టుం
డవు నీవు భూపతులలోఁ గౌరవ్యవంశోత్తమా॥

(భారత-ఆది - ౨ ఆ.)

నన్నయభట్టారకుని ధారాశుద్ధి కింతకు మించినపద్యములు "మదమాతంగతురంగ" నిండుమనంబు" లోనైనవి యెన్నో యున్నను దీని నుదాహరించుటకుఁ గారణము ప్రాసము దుష్కర మయినను నాతనిధార వడల దని తెల్పుట కని యెఱుంగునది.

## 2. కూర్పునేర్పు

మ॥ రజనీనాథకులైకభూషణుఁడవై రాజర్షివై ధారు
ణీ। ప్రజ నెల్లన్ దయతోడ ధర్మచరితం బాలింపు

చుం దొంటి ధ । ర్మజు నాభాగు భగీరథున్ దశ
రథున్ మాంధాతృ రాముస్ రఘున్ । విజయుం బో
లితి సద్గుణంబుల జగద్విఖ్యాత పారిక్షితా॥
(భారత - ఆది - ౨ ఆ.)

ఇందలి మూడునాల్గు చరణములఁ బోలిన కూర్పు శ్రీకృష్ణరాయవిరచిత మగు, ఆముక్తమాల్యద ౨ వ ఆ. మున ౭౧ వ పద్యమునఁ గలదు. ఇది కడు హృద్యము. ఎవరికవిత్వమునందుఁగూడ నిట్టివి పెక్కుపద్యములు దొరకవు.

## 3. సాంస్కృతికాన్వయవత్ప్రవృత్తి.

ఉ॥ ఆనసాంప్రాత్మజుం డగుయయాతి యధిజ్యధనుస్సహాయుఁడై । యానతశాత్రవుండు మృగయాలసలోలనబద్ధబుద్ధిఁ ద । త్కాననమెల్లఁ గ్రుమ్మరి నికామతృతశ్రముఁ డేగుదెంచె నం । దానలినాక్షియున్న విపినాంతరకూపతటంబు నొద్దకున్॥
(భారత - ఆది - 3 ఆ.)

ఇందలి మధ్యమధ్య నున్న విశేషణసంప్రదాయము సంస్కృతాన్వయ స్ఫోరక మని తెలుఁగఁ దగు

## 4. ఉపలక్షణత

చ॥ పరమగురూపదేశమునఁ బార్థుఁడు పార్థివరత్నశేఖ
రుం । డరిదిబలమ్మునన్ భుజబలాతిశయమ్మున
నీశుఁ బన్నగా । భరణుఁ బ్రసన్నుఁ జేసి దయఁ
బాశుపతాదిక దివ్యబాణముల్ । హరసురరాజదేవని
వహమ్ములచేఁ బడసెన్ గరిమమ్మునన్ ॥

(భార-ఆది-3 ఆ.)

అర్జునుఁ డీశుఁ బ్రసన్నుఁ జేసి పడసినది పాశుపతము మాత్రమే. తక్కినవారిని బ్రసన్నులఁ జేసినట్లు చెప్పనే లేదు. లేకున్నను నుత్తరమునఁ గలయంశమువలన నీశారాధనము తక్కినవారియారాధనమున కుపలక్షకమని యెఱుఁగఁదగు.

## 5. అన్యథాకరణము

ఉ॥ సంచితపుణ్యుఁ డంబురుహసంభవునంశము దాల్చి
పుట్టి లో । కాచింతుఁడైన వాఁడు నిఖిలాఘపుంజ
ము దేర్చెదన్ విభా। గించి జగంబులందు వెలిఁగించి
సమస్తజగద్ధితంబుగాఁ । బంచమవేదమై పరఁగుభా
రతిసంహితఁ జేసె నున్నతిన్ ॥

(భార-ఆది-3 ఆ)

“వ్యాసో నారాయణో హరిః” లోనగు ప్రమాణములంబట్టి నారాయణాంశసంభూతుఁ డనఁదగువ్యాసుని బ్రహ్మాంశసంభూతుఁ డనుట యన్యథాకరణ మని యెఱుఁగఁదగు.

## 6. విచిత్రసంబోధనము.

ఉ॥ ఈవసుధాధినాథుల జయించినయట్టిఁడ? నాకుఁ
జక్రమై । పోవక నిల్వ నా కెవరి పోర మదీయ
ధనుర్విముక్తనా । నావిధమార్గణోగ్ర గహనమ్మున
దిగ్భ్రమఁ బొంద కెమ్మెయిం । బోవఁగఁ బోలు నీ
కనుచుఁ బూరుషులోత్తముఁ డాఁకె వీఁకతోన్
(భార-ఆది-౮ ఆ.)

## 7. సముచ్చయలోపము

క॥ హిమకరుఁడు శైత్యమును న ।
ర్యముఁడుమహాతేజమును హుతాశనుఁ డుష్ణ ।
త్వము విడిచిరేని గుర్వ ।
ర్థము నాచేఁ బలికినసద్వాక్యమ్ము విడుతునే ॥
(భార - ఆది - ౮ - ఆ)

విడిచిరేనియు అనియున్నంగాని హృద్యముగా నుండదని యెఱుఁగునది. ఇందులకు

## 8. మఱియొక ప్రయోగము.

ఆ॥ వె॥ పర్వతములు వజ్రపాతహతిఁ బడక ।
దక్కఁ నేని నింద్రతనయుదివ్య ।
నిశితబాణతతుల నిశ్శేషమగుఁగాక ।
పరులసైన్య మెట్లు బ్రదుకుఁ బోర ॥

(భార - అరణ్య - ౧ ఆ.)

తక్కఁనేని అనుచోఁ దక్కఁనేనియున్ అని సమన్వయము చెప్పినయెడల, ఆదేవాలయ మెవరు గట్టించిరో నే నెఱుఁగనుగాని యీ కాలువ త్రవ్వించుట నాకుఁ దెలియును అనువాక్యమునకు దీటగు నని యెఱుఁగఁదగు.

## 9. సముచ్చయాధిక్యము.

“సీ॥ ... వదలక పెరుఁగుచున్నదియుఁ గాన”

(భార - ఆది - ౩ ఆ.)

## 10. మఱియొక ప్రయోగము.

“తే॥ గీ॥ ... సత్యమ్ముతో సరియుఁ గావు”

(భార - ఆది - ౪ ఆ.)

## 11. లోకానుసృతి

క॥ వీరెవ్వరయ్యా? ద్రుపదమ ।
హారాజులె యిట్లు కృపణులై పట్టువడన్ ।

వీరికి వలసెనె? యిపుడు ము।
హా రాజ్య మదాంధకార మది వాసెనొకో॥
(భార - ఆది - ౬ ఆ.)

12. లోకోల్లంఘనము.

"క॥...మఱుపక నుప్పించుమనది సమంజసబుద్ధిన్"
(భార - ఆది - 3 ఆ.)

13. మఱియొక ప్రయోగము.

"క॥ ...పరిజా । పతినిభుఁ డగుభార్గవునకు"
(భార - ఆది - 3 ఆ.)

లోకమునఁ బైని గుఱుతుంచిన పదముల దురర్థ మెఱుఁగనివారు లేరు.

14. ఏకదేశాన్వయము.

క॥"... వధగావచ్చిన విప్రార్థ్రమున..."
(భా-ఆది-3 ఆ.)

వధ గా వచ్చినవాఁడు విప్రుఁడుగాని విప్రార్థము కాదు.

15. పాణిసేయురిహాస్యజ్ఞత.

"క॥ భీమాసురవీరుల ము।
ష్టామష్టిగతోత్థితచ్ఛటాశబ్దంబుల్
(భార - అరణ్య - 3 ఆ)

ముష్టీముష్టి యే గాని ముష్టాముష్టి సాధువు గాదనువారు పెక్కురు గలరు. దీని సాధు

త్వమును దత్తద్వ్యాఖ్యానములవలన నెఱుఁగఁదగు.

16. రూపితవస్తుప్రాధాన్యము

చ॥ ...లతాలలనల్ మృదులానిలాపత ! శ్రితకుసుమా
తతతావళులు సేసలు వెట్టినయట్టులెరి"
(భార - ఆది - ౮ ఆ.)

17. వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తి

వ॥ సర్వలక్షణలక్షితంబు లైనదానిసర్వావయవములు
సూచి (భార - ఆది - ౮ ఆ.)

సర్వపదము దర్శనయోగ్యతావధిక మని వ్యాఖ్యానము చేయఁదగు.

18. పాణినీయవ్యాకృత్యనుస్మృతి.

క॥ విదితముగ నిన్నుఁ జేయిం
చెదఁ గ్రతువు ధరాధనాథ ॥
(భా॰ - ఆది - 3 ఆ.)

నీచేఁ జేయించెద నని తాత్పర్యము. సంస్కృతభాషలోఁ బ్రేరణార్థకధాతువుల కిట్టి ప్రయోగ ముండు నని యెఱుఁగునది.

19. అనువృత్తిప్రచారము

"క॥ పోరున మృతసంజీవని । కారణమున నిహతు
లయ్యుఁ గా రసురవరుల్" (భార - ఆది - 3 ఆ.)

"ఏమి గారు" అని యాకాంక్ష రాఁగా నిహతులు అనుపూర్వవాక్యస్థ మగుపద మను వర్తిత మగును.

## 20. నిషిద్ధమత్వర్థీయము.

ఆ॥ వె॥...శృంగియన్‌। పాండుః శృంగసముఁ దేవంత్యకోపి

(భార - ఆది - ౨ ఆ.)

"ఇట నకర్మధారయాత్" అనునిషేధమున్నను గ్వాచిత్కముగా భాష్యసమ్మతి కల దనియు నన్నయాద్యాంధ్రకవులు మాత్రము సార్వత్రికముగా వాడుచున్నారనియు నెఱుఁగునది.

## 21. అవివక్ష

క॥ ... గరుడుండు తల్లి కిట్లనియెన్‌॥

ఉ॥ ... పనుల్‌। సేయఁగ నేమికారణము చెప్పుము।

వాకుఁ బయోరుహాననా" (భార - ఆది - ౨ ఆ.)

ఈసంబోధనమున కిట నవయవార్థమును వివక్షింప వలసిన దని కవిహృదయము గాదు. స్త్రీత్వమాత్రబోధక మని యు నందుననుబ్యాకరణముంబట్టి, అమ్మా అనునర్థముమాత్రమే వచ్చు ననియు నెఱుఁగఁ దగు. సంస్కృత

మహాకవులకవిత్వములో నిట్టి వెన్నో కలవు. ఇంతమాత్రమున వారి కజ్ఞత కల్పించి యౌచిత్యభంగ మయ్యెనని యనుట సాహసము. వాస్తవదూరము. దీనింబట్టి భారత-అరణ్య-౭ఆ. లోని "తనులతాంగి" ఇత్యాదిసంబోధనములు గూడ సమర్థించుకొనఁదగు. ఆ విశేషణములు యముఁడు సావిత్రింగూర్చి పల్కినవి. ఆపె యప్పుడు మహాపదలో నున్నయది. పైఁగా నఖండపతివ్రత. యముఁడో, ధర్మస్వరూపుఁడు. ఇట్టిం డట్టిదుస్థితిలోనున్న సాధ్వి నట్లు సంబోధించు నని యెఱ్ఱన్నగా రనుకొందురా? వారితాత్పర్యమేమి? అవయవార్థమునకువివక్ష చేయక స్త్రీమాత్రబోధకముగా నర్థము చెప్పికోవలసినది యనియే. ఇట్టే కవులయాచార మని యెఱుఁగఁదగు.

## 22. ఔపచారికము.

క॥ మీరలు నాపితృదేవత।
లారాధ్యుల రేను మీకు నాత్మజుఁడను॥
(భార - ఆది - ౨ ఆ.)

ఒక్కఁ డందఱకుఁ గొమరుఁ డెట్లగును?

అందెవరికో యొకరికిమాత్రము కొమరుఁడు, తక్కినవారికి మనుమఁడు, మునిమనుమఁడు, ఇనుమనుమఁడు కావలెను. కాన పైపద్యము గ మూపచారిక మని యెఱుఁగఁదగు.

## 23. ప్రసిద్ధత్యాగము.

వ॥ అని సకలభువనరక్షణప్రభువులై యాద్యు లయిన హరిహరహిరణ్యగర్భపద్మామావాణీపతుల స్తుతియించి
(భార - ఆది - ౧ అ.)

త్రిమూర్తులును వేఱువేఱు కార్యములకుఁ బ్రసిద్ధి చెందిరి. అందు రక్షణ మనునది విష్ణునికిఁ బ్రసిద్ధము. అట్టిస్థితిలో మూఁగురకును దానిని జెప్పుటలో నభిప్రాయమేమి? వారు సర్వసమర్థులు గాన మన మన్యథాగాఁ గూడ వివక్షు చేయ వచ్చు ననియే భట్టారకాశయము. అట్లుకానిచో, "ప్రత్యేకమకబళే ముక్తా కాపాతః" అనునట్లు వాగనుశాసనుఁడే ప్రవర్తించినఁ దక్కినవారిగతి యేమి?

## 24. విశేషణ విశ్లేషణము

వ॥ ... అట్టిభృగునకుఁ బుత్త్రుఁడై పుట్టి పరఁగిన॥

క॥ చ్యవనునకు సుకన్యక సంభవ మయ్యె ఘనుండు
(భార - ఆది - ౧ అ.)

పరఁగిన అనుసదివిశేషణము. అది తదనం తరపద్యముమొదటనున్న 'చ్యవను' నిత్యోనన్వయింపవలెను. ఇట్టిప్రయోగములు కడుమృగ్యములు గాని నిర్దుష్టము లని యెఱుఁగఁదగు.

25. లోకోక్తి.

వ॥ ... వినత నీ నీవేకన్నులం జూచితే...

(భారత - ఆది - ౨ ఆ.)

నీవు చక్కఁగాఁ బరికింప లేదనుటకు లోకమున నిట్లు వ్యవహరింతురుగదా.

26. లింగవ్యత్యాసము.

ఉ॥ ... విప్రులఁ బొంది యున్న యపవిత్రులు పూజ్యులు గారె? కావునఁ | విప్రునిలుండ? వెల్వడుము వేగమ నీవును నినిషాదియుఁ॥

(భార - ఆది - ౨ ఆ.)

విప్రుని బొంది యున్న నిషాదింగూర్చి నవాక్యమున సామాన్యవచనముగా "పూజ్యులు" అని వ్యవహరించుట దోసము గాదు. ఇట స్త్రీపుంలింగముల కేవిశేషము గూడఁ జేయనక్కఱలేదని యెఱుఁగునది. ఇట నిషాది నిషాదుని గూర్చి తనుసర్థమునవచ్చినజీవ్పుగా నెఱుఁగఁదగు.

### 27. మహాదమహాత్సాంకర్యము.

వ॥ ... ఆసారమేయము నడిచిన నది యఱచుచు

(భార - ఆది - ౧ ఆ.)

### 28. మిశ్రసమాసగ్రథనచాతురి.

ఉ॥ ... ఎవ్వనియోరిముఖామృతాంశు బిం | బమ్మున,,

(భార - ఆది - ౧ ఆ.)

ఈ 'పని' కి సమాసమధ్యస్థితి గలిగింపఁ దగుధీరుఁ డింకొక్కఁడు గానంబడునా? అది యమ్మహామహునికే చెల్లినది.

### 29. పాదపూర్తి.

చ॥ ... పాండవో | త్తములచరిత్ర నాకు సతతంబు
వినంగ నభీష్ట మెంతయుఁ ॥

సతతంబు అనునది యుండఁగా "ఎంత యుఁ" అనునది పాదపూరణార్థకమే కాని కొందఱు దానికి 'మిక్కిలి' అనునర్థము గాన "ఎల్లప్పుడును, మిక్కిలిగా" వినుటయం దాసక్తి యని సమన్వయింతురు. అది సహృదయులొప్పరు.

### 30. విపులీకరణనైపుణి.

చ॥ జలధివిలోలవీచివిలసత్కలకాంచిసమంచితావనీ |
తలవహనక్షమం బయినదక్షిణహస్తమునం దదుగ్ర

మ। గ్గళదురుఘుర్మవారితగాతపుత్రిక రాజ్యము గట్టి పూ
తిలో। వెలువడఁ గోమలిం దిగిచె వీక్షితకీర్తి యయాతి క్రితిత్రోగ॥

(భారత - ఆది - 3 ఆ.)

యయాతి దేవయానిని నూతినుండె బయటికిఁ దీసె ననునది యిందలిముఖ్యాంశము. దాని నెంత పెంచెనో అది యెంత రసము నించెనో సహృదయు లరయుదురుగాక.

## 31. 'కుంచింపు'

చ॥ అతులబలాఢ్యులైన యమవాతాంశసముద్భవులెల్లఁ
బాండుభూ। పతిసుతపక్షమై సురవిపక్షగణాంశజు
లెల్ల దుర్మదో। ద్ధతకురురాజపక్షమయి ధారుణిభా
రము వాయ ఘోరభా। రతరణభూమి నీల్గిరి పరస్ప
రయుద్ధము సేసి వీరులై॥

(భారత - ఆది - 3 ఆ.)

ఇందు యుద్ధపంచకగాథయే కాక యాయాయీవీరులయంశావతరణములు ధర్మజదుర్యోధనుల యోగ్యతాయోగ్యతలుగూడ సంగ్రహింపఁబడినవి. కాని యిది కథసుగూచించుటకే యుదాహరణ మనుకొనుట యొప్పు. మఱి యొకటి రెండుగూడ నుదాహరింతము.

క॥ తనయెఱిఁగినయర్థం బొరుఁ । "డనఘా! యిది యెట్లు
సెప్పు మని యడిగినఁ జె। ప్పనివాఁడును సత్యముఁ
జె। ప్పనివాఁడును ఘోరనరకపంకమునఁ బడుఁ॥

(భార - ఆది - ౧ ఆ.)

క॥ మతిఁ బరికింపఁగ జీవిత ।
మతిచంచల మెండమావు లట్టులు సంప ।
త్ప్రతతు లతిక్షణికంబులు ।
గతకాలము మేలు వచ్చుకాలముకన్నన్॥

(భార - ఆది - ౫ ఆ.)

## ౩౨. భిన్నక్రమము

క॥ ... యజనస్వాధ్యాయకవ్యహవ్యతపోదాన॥

(భార - ఆది - ౮ ఆ.)

హవ్యకవ్యములు గాని కవ్యహవ్యములు గావు "పాఠక్రమా దర్థక్రమో బలీయాన్" దీనింబట్టి భారత— అరణ్య- ౭ ఆ. లోని "క॥ మామయు నత్తయు" లోనగునవి సమాహితములని యెఱుఁగదగు.

## ౩౩. పునరుక్తవదాభాసము

"శు॥ రాజయినవాఁడు తనరాజ్యభారంబు తాన చూచి యారయ వలయు"

చూచి విమర్శింప వలయునని తాత్పర్యము

## 34. క్రమాన్వయము.

క॥ పిడుగును గాడ్పును జమలకుఁ।
బడుటయు వీచుటయు—॥

(భార-ఆది-౬ ఆ.)

పిడుగుపడుట గాడ్పు వీచుట అనియన్వయము. భార-అరణ్య-౭ ఆ లోని—

ఉ॥ కలిమియు లేమియున్ సతము గా వవి పొందినచోఁ
జెలంగుచున్। గలఁగుచు నుక్కడీరుల ప్రకారమె॥

లోనగున పిల్లే యెఱుఁగఁదగు ఇట్టివి సంస్కృతమున విశేషించి కలవు. ఆంధ్రమునఁ బ్రకారాంతరమున నిట్టివి ప్రబంధములయం దున్నను సామాన్యవాక్యములయం దంతగా లే వని యెఱుంగునది.

## 35. తృతీయార్థక పరిభవ

క॥... వినయము। మెఱయుచు నుండిరి.

(భార-ఆది-౬ ఆ.)

వినయముచే మెఱయుచు నని యర్థము

## 36. వక్రాన్వయము.

క॥... దండింపఁగ బ్రాహ్మణుండఁ దగునే నన్నున్

(భార-ఆది-౫ ఆ.)

(నేను) బ్రాహ్మణుండఁ నన్ను దండింపఁగఁ దగునే యని యన్వయము.

### 37. నిరర్థక ప్రత్యయము.

క॥... గావింపు। విచిత్రవీర్యక క్షేత్రమునన్॥
(భార-ఆది-౪ ఆ.)

సంజ్ఞావాచకమునకుఁ గప్రత్యయము చేర్చుట యంతహృదయంగమము కాదు. అందులో స్వార్థమున మఱియుం గూడదు. ఇటుఁ గొందఱు 'అల్పార్థకత్వకుత్సితార్థకత్వములు కల్పింపఁ జూతురు గాని యంతకన్న యుత్థానమున నొకానొకప్పుడెంతవానికినినిట్టి కక్కుఱితి కలుగుచుండు ననియు నంత మాత్రమున గ్రంథకర్తను బరిహసింపఁ దగదనియుఁ దెలిసికొనుట సమంజసమని మాయభిప్రాయము.

### 38. 'తాను' ప్రయోగపు సొగసు.

"ఉ॥ ఎంపలదాన కోమల యిసుమ్యము వాసది కోడ
సల్పుచున్ । సుందరి? నీవు నిట్లునికిఁ జూడఁగఁదా
నుచితంబె॥" (భార-ఆది-౪ ఆ.)

### 39. షష్ఠ్యర్థకప్రథమ.

వ॥ చనుటయు ... పుట్టుటయు ... ఉంటయు
నీ కారణంబు॥ (భార-ఆది-౪ ఆ.)

చనుటకును, బుట్టుటకును గారణ మేమి అని యుండుటకు బదులు ప్రశ్నమగా వాడఁబడియె. లేదా! ఏమి కారణము గలది యని యేని యౌపచారికముగా నన్వయించుకొనఁదగు.

### 40. బహ్వర్థకైకవచనము

"ఒండు గావు ప్రియములు"

(భార - ఆది - ౪ ఆ.)

ఒండు "ఒక్కటి" కి రూపాంతరము. ఇది యన్యశబ్దార్థకము. ప్రకృతము బహువచనార్థమున నుపయోగింపఁ బడినది.

### 41. అశాస్త్రీయపదాభాస.

వాఙ్మనఃకాయప్రవర్తితాశేష॥

(భార - ఆది - ౩ ఆ.)

వాక్కు, మనస్సు, వాఙ్మనసం అని కావలెఁ గదా యని స్థూలదృష్టులశంక. వాక్కు, మనస్సు, కాయంచ, అనిబహుపదద్వంద్వ మనియు, అచతురేత్యాదిసూత్ర మున కిది విషయము గాదనియు, మర్మజ్ఞులసమాధానము. దీనింబట్టి తిక్కన యెఱ్ఱన రామలింగాది మహాకవుల ప్రయోగములెల్ల సమాహితము లని యెఱుంగదగు.

## (42) సాన్నిధ్యబలము

క॥ "కడుఁదడవు నిద్ర వోయితి"

భారత-అరణ్య-౭-ఆ॥

నిద్రాశబ్ద సాన్నిధ్యమందే పోవుధాతువున కనుభవార్థకత్వప్రతీతి యని యెఱుఁగునది.

## (43) ఆపాతతస్సిద్ధి

క॥ ...నేఁ డింతపడి మసలుటకు వా।
రెంతపడిరో యేమిరైరో యెట్లున్నారో॥

ఎంత 'పరితాప' పడిరో, అనునది దానియందు తనదియే సిద్ధించును. ఇటఁ బడుధాతువు సకర్మకము.

## (44) ప్రధాన పరిత్యాగము

క॥ వినుము మనోవాక్కాయము
లన మూఁడు తెఱంగులందు నంతఃకరణం
బనఘ! ప్రధానము"

మూఁడు తెఱఁగులగు కరణములయం దని చెప్పవలసియుండును. కరణశబ్దము కాయమునకుఁ గూడ వాచకమగుఁగాన సీతిత్రికమునకుఁ ద్రికరణము లను పేరు చెల్లును. "కరణం సాధ

కతమక్షేత్ర గాత్రేంద్రియేష్వపి" అని యమ
రము.

### (45) భావప్రధాన నిర్దేశము.

చ॥ పతిరహితంబు దుస్సహము, భర్తృవినాకృతయైన
కాంత దూ। షితయగు..."

ఇట రహితము రాహిత్యార్థమున నుప
యోగింపఁబడినది. ఇట్లే కవిత్రయము వారి
"సహాయము" "సరసము"లోనగునవియుసమా
హితము లని యెఱుఁగఁ దగు. ప్రకృత పద్య
మునందు, జీవనము అనునదియర్థ్యాహార్యము
కాఁగూడదా? యందురేని, కావచ్చునుగాని
యనార్థ మంగీకరింపఁదగిన భావప్రధానత
నాశ్రయించుట యంతకన్న సుగమోపాయ
మని యెఱుఁగఁదగు.

### (46) అభేదోపచారము.

తే॥గీ॥ ఏడు మాట లాడినయంత నెట్టివారు
నార్యజనుల కుఁ జుట్టమ్ము లగుదు రనిన..."

పైవాక్యము "సఖ్యం సాప్తపదీనం" అనును
క్రింబట్టి పుట్టినది. "అథమిత్రం సఖాసుహృత్"
సఖశబ్దము బంధుపర్యాయము గాదు గాన

నిట నభేదోపచారము స్వీకరింప నలయును.

(47) యాదృచ్ఛికానుస్మృతి

క॥ ...తేప వము కడవఁ బెట్టిన
నీపుణ్య చరిత్ర కీర్తనీయము తల్లీ॥

ఇందలి తుదిచరణము శ్రీ నన్నయభట్టారకుని

క॥ ...మునులకు
నీయింద్రియజయము కీర్తనీయము తండ్రీ॥

(భార-అరణ్య-౧-౭)

అను రచనకు జ్ఞాపక మగుచున్నది. ఏకవి గాని యింతమాత్రమున గ్రంథచోరుఁ డనఁ దగఁ డనియుఁ దనకన్న బ్రాచీనులగు కవులలోఁ దన కేకవికవిత్వమున నెక్కుడభిమానముండునో యతని కవిత్వమునందలి పోలికలు తనరచనలో యాదృచ్ఛికముగా నేని రాకమానవనియు నెఱుఁగఁ దగు. ఈవిషయమున కిట నిచ్చిన యుదాహరణ మంతబలవత్తరమైనది కాదు. ఎన్నేని యుదాహరణములు మిగుల బలవత్తరములు కలవని యెఱుఁగునది. ఎట్టివంటి మహాకవికైనచో నీయనుస్మృతి యాదృ

చందమయేని జనంగ నేల యిం। పమరఁగ నింత
ప్రొద్దు సుగుణాకర యిచ్చట నిల్చి రేపు వో। దమె
తెఱఁగెద్ది? నావుడును దన్వికి సాత్వతమాఱుఁ డిట్లు
మన్॥ (భార-అర-౭-ఆ)

(50) అనుకృతిస్వాతంత్ర్యము

క॥ ధిక్కారమ్ములు చరణద।
భక్కారమ్ములును...॥ భార-శల్య-౧-ఆ

ఇందు దభక్కారము స్వేచ్ఛాద్యోతకము.

(51) అకర్మక సకర్మక వినిమయము.

(1) తే॥గీ॥...అపుడు। విడుచుటకై ప్రాణ మాఁగినాడు

(2) తే॥గీ॥ పార్శ్వములనుండి పన్యపుణ్యాంగనాని।
కరము లతితయూకమాక్తికములు సేస।
లొలుక ... (భార-శాంతి-౧-ఆ)

పైనిఁజూపిన 'ఆఁగు' 'ఒలుకు' అనునవి
వ్యవహారమం దకర్మకములు. ప్రకృతము సక
ర్మకములని యెఱుఁగఁదగు.

(52) అర్థకవిశేషణము.

ఉ॥ ధన్యుల కాసుభద్రదు శత్రకతుపుత్రున కుద్భవించె॥
(భార-ఆది-౮-ఆ)

ఇట ధన్యులకు అను బహువచన మర్థగ
తద్విత్వ ప్రయుక్త మని యెఱుఁగఁదగు.

## (53) సర్వనామ సంఘటనా నైపుణి.

చ॥ అనిన నుపేంద్రు వాక్య మన నయ్యమృతమ్మునఁ జేసి

భార-సభా-౧-ఆ

ఇట అయ్యమృతము అనుచోనున్న సర్వనామప్రయోగము కడు హృద్యము. ఇతరకవుల ప్రయోగములందు మృగ్యము.

చ॥ ... శిరముల కొప్ప నర్చనలు సేసినపువ్వులయవ్వి
ధమ్మునన్॥ భార-ఆది-౮-ఆ

లోనగు భారత ప్రయోగముల సొబగెల్ల నిట్లేయరయుదురుగాక.

## (54) ధారుణీగతోకార నిర్ణయము.

చ॥ గుణముల నొప్పి బ్రాహ్మణులకుం గడు భక్తుఁడవై
సమస్తధా। రుణిప్రజఁ బ్రోచుచున్ విగత రోషుఁ
డవై...॥ భార-ఆది-౭-ఆ

యతిస్థానమున నుంటచే ధారుణి యుకార మధ్యమనుట వాగనుశాసన సమ్మతము. ఎక్కువ విమర్శనాజ్ఞానము గలవా రనేకులు 'ధారిణీ' శబ్దము వలె 'ధారుణీ'శబ్దము నొప్పరు. ఇది సంస్కృతకవి ప్రయోగములచే నిర్ణయింప శక్యము గాదు. ఉకారము లేఖకప్రమాద

మనినం బోఁగలదు. ఈవిచారము నేటికి 20 వత్సరములకు మున్ను శ్రీ మహామహోపాధ్యాయ పరవస్తు రంగాచార్యులవారి సందర్శనమున కరిగినప్పుడు ప్రసక్తించినది. ఇటీవలఁ బాలకాలమున క్త్రీప్రయోగము చిక్కినది. ఉభయరూపములును సాధువు లని యెఱుఁగఁ దగు.

### (55) అపూర్వ ప్రయోగము.

సీ॥ ... ఆ॥వె॥ ఉంతుఁగా వుతమ । యఖండిత ము॥

భార-ఆది-౯-ఆ

ఇట కావృత్త + అ, అనియుండ మకారాదేశము వచ్చుటంబోఁ జిక్కు లేదుగాని భారతమునందక్క వేఱొకచో నిట్టిప్రయోగ మిట్టి పట్టున మృగ్యము.

### (56) సార్థబిందు నిరర్థబిందు ప్రాససాంకర్యము.

క॥ విగువెడలక ... యె

సఁగుఁ బూర్వస్థితిన బ్రదుకునమకూరంగ॥

భార-శాంతి-3-ఆ

### (57) శసప్రాసమైత్రి.

ఆ॥వె॥... చతు । ర్దసుల నుభయపతులవశత వచ్చు॥

భార-అను-శా-౪-ఆ

## (58) అఖండ విశ్రమము.

సీ॥-తే॥గీ॥-చెప్ప। నయ్య పుణ్యసతీ ప్రభావంబు నాకు॥

భార-అర-౫-ఆ

## (59) నమ్మి నమ్మకను గూర్చి

క॥ నమ్మమి మృత్యువు, పెద్దయు ।
నమ్మట యమృతత్వ మగుట నరపతి నమ్మి
నమ్మక...॥ భార-శాంతి-౨ఆ

56, 57, 58, 59 సంఖ్యలుగల ప్రయోగములిటీవల నిన్న మొన్న నచ్చయిన భారత సంపుటములో దిద్దఁబడి యున్నవి. కాని యథాశ్రుత పాఠముల ననుసరించి తదనంతర మహాకవులెల్లఁ బ్రయోగించికొని యుండుటచేత నేమి, మఱికొన్ని హేతువులచే నేమి, దిద్దుటయే చింత్యమని సంక్షేపము

## (60) సాహచర్య విశేషము.

వ॥...కూఁతునల్లుని బూజించిన॥

భార.ఆది.3.ఆ

ఇట "పూజించు" ధాతువుతోఁ గూఁతుశబ్దార్థముగూడ నన్వయించినను గేవల మాపెను మాత్రమె యుద్దేశించి నప్పు డిట్లు ప్రయోగింపఁబడియుండ దని యెఱుఁగఁదగు.

## (61) నిర్బీజ ప్రయోగము.

వ॥... ఋతుమతియునై యాత్మగతంబున

భార-ఆది.3 ఆ

ఆత్మగతశబ్దము నిర్దుష్టమైనను నిట్టియర్థము న దీనికిఁ బ్రయోగము సంస్కృతమున మృగ్యము గానఁ దత్సమములోనుండుట యపూర్వ మని యభిప్రాయము. ఇట్లే 'అంతర్గతంబున, లోనగు ప్రయోగము లెఱుఁగునది.

## (62) ప్రయోగ వైచిత్ర్యము.

మత్త॥ నీతదర్థము గాఁగ దేవవినిర్మితం బిది,

భార-ఆది- ౨ ఆ

## (63) యతివలని యుపయోగము.

చ॥...వి జితేంద్రియుండవఁగ నమ్మతిఁ జాయక విందు వంచు దా। నిది కలరూపెఱుంగ వవనీపతి యూత్సు కుఁ డయ్యె వాత్మలోన॥

భార-ఆది-౪-ఆ

ఇట సామాన్యముగాఁ బదచ్ఛేదము చేసికొనువారికిఁగూడ ఇది యని విఱుగ దని తెలిసికొనుటకు విశ్రమము కొంతోక సహాయ మొనర్ప వచ్చును. సూక్ష్మదర్శులగువారి కే సాయముతోఁగాని పనియె లేదు గాన నింత

మాత్రమున యతికిఁ బూర్ణమైన సార్థక్యము
గలుగునని చెప్ప సాహసింపము. దానికి నింత
కన్నను ముఖ్యప్రయోజనములు కల వని యె
ఱుఁగునది. అవి వేఱొకచో విస్తరింతును.

(64) పర్యాయత స్సౌకర్యము.

క॥ ...పాణిగ్రహణము చేయుము నన్నున్॥

భార-ఆది-౪-ఆ

పాణిగ్రహణమునకుఁ దెలుఁగులోఁ బర్యా
యపదము పెండ్లి అనునది. నన్నుఁ బెండ్లి చేసి
కొనుము, అని సమన్వయించు కొన్నప్పుడే
ద్వితీయ హృదయాంగమ మని యెఱుఁగఁదగు.
"కొస" లేకుండఁగూడ నాత్మనేపదార్థకత్వము
భారతసమ్మతమని యన్యత్ర విస్తరింపఁబడియె.

(65) విశేష్యద్వితయాపాతము.

క॥ ...ఎనమండ్రం గాంచి గంగ యెంతయుఁ బ్రీతిన్
...వ॥ గంగ సంతసిల్లి యిట్లనియె.

భార-ఆది-౪-ఆ

పైనిఁజూపినఁ గంగ అనునది రెండుపర్యా
యములు వేఱువేఱు చోట్ల వాడఁబడినను వా
నికి రెండిటికిని దుదకునన్వయము "యిట్లనియె"

అనుసంపూర్ణక్రియయందే కావలయును. అట్లే ని యిందొకటి వ్యర్థమై తీరవలయును. కాని రచించు ధోరణిలో నిట్లు ప్రతికవికిని బహు చుండు ననియు భిన్నప్రదేశస్థితికతన నిదిసహ్య మనియు నెఱుఁగఁదగు

## (66) సామాన్య నిర్దేశము.

క॥ జనవర! యాగ్రామానిని న ।
న్నను మఱి నీభార్గవరులనుం జూచితె నీ ।
వనవుడుఁ జూచితి (నన్నిటి)
ననఘా! వృక్షమున నున్న యావిహంగములో॥
భార. ఆది-౫-౮

ఇట 'అన్నిటి' అనునది యమహదర్థకము. కర్మవాచకములలో మాత్రానుసారమే దాని కనుగుణ మగునుగాని తక్కిన మహదర్థకములు కావు. పోసన్ను 'అన్నిటి' అనునది అంద ఱ అని సవరించినచో "మాత్రను" సమన్వయించు పడు. అయినను బాహుళ్యమును బట్టి "అంద ఱ" నుటయె యుక్తము, గాని వ్యక్తిని బురస్కరించుకొని "సామాన్యే నపుంసకం" అను శాస్త్రానుసారమున "అన్నిటి" అనివాగనుశాస నుడుఁ వాడె నని యెఱుఁగునది.

## (67) మహాద్వీపత.

కం॥... పాండవ ధ్వజ। ప్రాకారంబు జాముండెను॥

భార-ఆది-౬-ఆ

ఇట ప్రాకారమనుట యుక్త మైనను సముద్రాదశబ్దములకుంబలె మహాద్వీపత్వ చేయఁబడినది. సముద్రాదులయందు దేవతాత్మత్వమున్నట్లు ప్రాకారమునకుఁ లేదు. లేకున్నను గ్రాచిత్యముగా నట్లు వివక్షింప వచ్చునని భట్టారకుని యాశయము, కావుననే తెనాలి రామకృష్ణకవి—

సీ॥ అఖిలభూమీపాలకాస్థానకమ
లాకరోదయ తరుణ సూర్యోదయుడవు.

అని, ప్రయోగించికొనియె నని యెఱుఁగఁదగు.

## (68) యౌగికబలీయస్త్వము.

వ॥ ...... పవనతనయుఁ బ్రాహ్మణార్థమ్ముగాఁ
దన నమర్పించుటయుం జెప్పి ....(భార-ఆ-౬-ఆ)

బ్రాహ్మణార్థశబ్దము యోగరూఢము దీనిని పితృకార్యనిమంత్రణమునమాత్రమే కృష్ణాగోదావరీతీరవాసు లగుపండితపామరులు యోగరూఢముగా వాడుదురు. నన్నయ గో

దావరీతీరస్థుఁడయ్యు బ్రాహ్మణప్రయోజనము అనుసర్థమున దీని నుపయోగించెను. వేఱొక బ్రాహ్మణార్థమువలె నిదియూఢముగాఁ జాలదు. శాస్త్రకర్తలు రూఢికి బలీయస్త్వమును శాసించుచున్నను నియ్యెడ నవయవార్థమునకే బలీయస్త్వము చెప్పక తప్ప దని యెఱుఁగునది. కొన్నిశబ్దములకు నెక్కొక్కచో నిట్లు చెప్పినం గాని కాళిదాసాహలకవనముఁగూడ దుస్సాధ మగునని ప్రాజ్ఞు లరయుదురు గాక.

(69) ప్రయోగవైచిత్ర్యము

చ॥ ...ఏ। నెత్తిఁగిన యంతనండియును నిట్టిలతాఁలి తాంగిఁ జూచి యే నెఱుఁగ.........॥

(భార-ఆది-౭-ఆ)

(70) అచ్చరక్రమతిసంశ్లేషము.

మత్త॥ ......మదీయభాషితమెన్నఁడు। న్నోని మోఘము గాదు దిగ్ధరణీరవీందు లెఱుంగఁగన్॥

(భార-ఆది-౭-ఆ)

ఇట 'ఎన్నఁడో నేని' అని కొన్నిపాఠములు గనవచ్చుచున్నవి. కాని యీదిద్దుఁబాటును శాస్త్రకర్తలు పాటింప లేదు గాన దిద్దుట చింత్యము. ఇందులకు సహాఁబలపంజికియును

చూడఁదగు. భారతాధారముననే మహాకవి పోతరాజుగారు భాగవతమున నిట్టిప్రయోగములు కుప్పతెప్పలుగాఁ బ్రయోగించి రని యెఱుఁగఁదగు.

(71)గౌరవార్థకబహువచనము

వ॥...వీరు కుంతీమహాదేవులు॥

భార-ఆది-౪-ఆ

నిందార్థమున 11 వ అంకెగలచోఁజూపఁబడియె.

(72) అపూర్వప్రయోగము.

క॥...పర్వతశిఖరం బెత్తి వి। గుర్వంపుము చూత మనిన గోత్రభిదుండున్॥

భార-ఆది-౪-ఆ

(73) ప్రయోగస్వాతంత్ర్యము.

క॥...హిమపర్వతపార్శ్వమునందు॥

భార.ఆది-౫-ఆ

హిమవత్పర్వత మనుటకు హిమపర్వత మని యుపయోగింపఁ దగ దని కాదు గాని జ్ఞానలవదుర్విదగ్ధులు చేయుకుశంక కవకాశము గలుగు నని యెంచి వ్యాఖ్యానము చేయబడియె. దీనింబట్టి కుంభోద్భవుఁడను నర్థమున

ప్రయోగించిన—“కుంభపోద్భవుండు” (భార-ఆది-౮-ఆ) ‘జలధిశయనుఁ’ డను నర్థమునఁ ప్రయోగించిన——“జలశయనుఁడు” (భార-ఆది ౮-ఆ॥) లోనగునవియు వ్యాఖ్యాతము లని యెఱుఁగునది.

(74) స్వరతో విశేషప్రతిపత్తి

వ॥...తపోమహిమ 'నెవ్వరికంటె బెద్ద యయినవాని

భార-ఆది-౬-ఆ

ఇట ‘స్వరవశమున’ ఎవ్వారికంటె అనుదానికి, ‘అందఱికంటె’, అనునర్థము వచ్చు నని యెఱుఁగునది.

:(75) అతన్త్రత

క॥ మఱియూరు పురము॥

భార-ఆది-౮-ఆ

ఇట ‘ఊరు’ అనుదానికి సర్థము వివక్షింప రాదు. వివక్షించినచో “పురము” అనునది పునరుక్తమగును. ఊరు, వేయి, పురము వేయి, అనుట, వితండవాదము కాన నుపేక్షించి సంజ్ఞావాచకగతైక దేశమున కిట్టి పట్టుల సర్థవివక్ష చేయుట ప్రాజ్ఞసమ్మతము గా దని స్వీకరించుచు

సీ॥......అన్నమాంబాపతి॥

భార-విరా-౧-౪

లోనగు ప్రయోగములు నుసాధనము ల
గుట కిదియే మార్గమని యెఱుఁగఁదగు.

(76) విలోమద్వంద్వము

వ॥...వసుదేవదేవకులకుం జెప్పి

భార-ఆది-౮-౪

దేవకీవసుదేవు లనుట యుక్తము అయి
నను ఛందస్సౌకర్యమునకై యిట్లుమార్పవల
సివచ్చినది. ఇట్లే—

వ॥ నలదమయంతులిద్దఱు

భార-అర-౪౪

లోనైనవెఱుఁగఁదగు. కేవలాంధ్రకవులే
కాక సంస్కృతమహాకవులుగూడ నిందులకు
సమ్మతించిరి. మేఘసందేశస్థ "నదనదీ" త్యా
దికాళిదాస ప్రయోగములు చూడఁదగు.

(77) సప్తమ్యర్థకప్రథమ.

ఆ॥... వానిచెంత లొకటియేనియుఁ దలఁపవు

భార-అర-౫-౪

(78) సంధిపట్టున 'ఋ' కారము హల్లుగను గూర్చి

మ॥... గర్వోన్నతుల్ ఋతువా నరవీరుల్

భార-అర-౬-అ॥

ప్రాసవిషయమునకు 'అప్పకవీయము చూడఁదగు.

(79) ప్రయోగ వైచిత్ర్యము

వ॥ హరియందు లక్ష్మిని... ...వసిష్ఠునందరుంధతిని బోలి సుందరి? నీపతునందుఁ బ్రీతి పతిభక్తి యొప్ప నపత్యంబు వడయుము

భార - ఆది - ౧ - ఆ

(80) భిన్నలింగోపమితి.

ఉ॥ ఆధృతరాష్ట్రిఁ దాఁ గాంచిన ట్లుచెన్......॥

భార - ఆది - ౬ - ౮

దీనిఁగూర్చి రసగంగాధరమునఁ గొంత చర్చించెఁగాని క్వాచిత్కముగా సహృదయ రంజక మగునేని యిట్లు కూర్పం జను ననుతన సమ్మతిం దర్శించెను. విస్తర మందే చూడుఁడు

## (81) ప్రయోగవైచిత్ర్యము

క॥...గుహో । ద్భాసితు వినివట్ల చూచి॥

భార - ఆది - ౫ - ౮॥

తా న్గ్లు విని యుండెనో యంపుల కింపు కయుభేదింపనిద్రోణాచార్యునిఁ జూచె నని తాత్పర్యము.

## (82) తెలుఁగుమరియాద.

క॥... ఘనతరముఖ నేత్ర నాసికా కర్ణములందు॥

భార - అర - ౬ - ఆ॥

ఇటసంస్కృతమునందు "ముఖ...కర్ణమ్" అని ఏకవద్భావము వచ్చును. తెలుఁగులో బహువచనము చేయుటకుఁ గారణ మర్థగత బహుత్వ మాని యెఱుఁగఁదగు. కొందఱీసందర్భ మెఱుంగక దిద్దుచున్నారు. కొన్నిచోటుల దిద్దఁబడినను—

వ॥... వికలహృదయ లైనసఖీజనంబులు,

భార - అర - ౨ ఆ॥

క॥ దేవతలు ధర్మకర్తలు

భార - అరణ్య ౨ ఆ॥

ఇత్యాదులయం దర్థపౌధాన్యముం జేసి యేవిశేష్యవిశేషణభావ ముపపన్నము గావ లయును. లేదా? నిత్యస్త్రీలింగ మగు 'దేవతా'శబ్దమునకు ధర్మవర్తులు, అనువిశేషణము సమంజస మెట్లయ్యెడిని? ఇట్లే సఖిజన, శబ్దమునకు, వికలహృదయలు, అనునదియు నని యెఱుఁగఁదగు. అన్యత్రి స్వీకరింపఁ దగిన యావశ్యకత కిచ్చటనే తావొసంగుట యుక్తమని విజ్ఞు లెఱుఁగుదురుగాక—

(83) విదితాన్వయము.

ఉ॥ ......పాండుభూ । పాలుని ధర్మనందనుని, పం
జకనాథునియట్ల కావె,

భార - ద్రోణ - 3 - అ॥

(84) చరిత్రచర్వణము

తే॥ గీ॥ వంతఁ దలపోసి తలపోసి, వనరి వనరి ।
మిగుల వందురి వందురి పొగిలి పొగిలి

భార - విరా - ౨ అ

చెప్పినవిషయమే చెప్పినను నిట రసము చెడ లేదు.

(85) సర్వశబ్దపర్యాయము

ఉ. ...ఎల్లవాఁ। డుంగనవారిఁదోడ్కొ_నికడున్ రభస
మ్మున॥

భార - విరా 3 ఆ

ఈ 'యెల్లవాఁడు' సర్వశబ్దమునకు సరియై యేకవచనమందుండియు బహువచనమందుండి యు నొకటేవిధమగు నర్థమును బోధించెడిని, గాని యేకవచనమున నించుక వైలక్షణ్యము కలదు. అది సహృదయు లరయుదురుగాక. మఱియు 'ఎల్లవారు'అనుటకు 'ఎల్లరు'అనురూపాంతరనుుకలదుగాని ' ఎల్లవాఁడు' అనుదానికి ' ఎల్లఁడు ' అనురూపాంతరము మృగ్యము. అట్టివాఁడు అట్టిఁడు లోనగువానింబట్టి చూచి నచో నుండవలసివచ్చుచున్నను, అనభిధాన మగుటచే లేదనుకొనవలయును.

(86) ఈయన కియ్యనయుం గలదు

ఉ॥ ... తల్లి? నీ। కియ్యవలక్ష్మి నూఁది చరియింపక యిప్పుడు వాగఁ బాడియే॥

భార - ఆశ్రమ - ౧ - ఆ

ఈప్రయోగము వ్యాకరణవిరుద్ధ మని లే

దుగాని 'ఆయనకు అయ్యన, ఈయనకు ఇయ్యన' లోనైనవి యనభిధానపాఠ్యయమ్ములగుటచే నుదాహరింపఁబడియె నని యెఱుంగునది.

(87) లాక్షణికప్రయోగము.

తే॥ గీ॥ అనుదినమ్ము మభక్షింతురర్థవంతు॥
భార—

(88) నణప్రాసవిచారము.

ఆ॥ వె॥ దుర్ణయమున కరుని కర్ణదుశ్శాసనుల్,
భార-ఆర-౩-ఆ

దుర షత్వణత్వయోః॥

అనువిషేధ ముంటచే నియ్యెడ ణత్వము దుర్ఘటముగాన 'దుర్నయ' అని దిద్ది దీనికి
ఆ॥ వె॥ ...అక్షౌహిణి, యానిరంతర ప్రమాణసంఖ్య॥
భాగ-ఆ౧-౧-ఆ

అనుదానిని జతఁ జేసి, "ఉభయప్రాసము భట్టారకసమ్మతంబ" అని నేఁటివారొకరు వ్రాయుచున్నారు. ఉభయప్రాసము. అనఁగా నణప్రాసము భట్టారకునకు సమ్మతము కాకేమి గాని పైవారనుకొను తెఱఁగున మాత్రము సమ్మతము కాదు. కావుననే అప్పకవి—

ఆ॥ వె॥ ధాత్రిఁ బాణినీయ సూత్రి॥

అనుపద్యమునందు నెట్టిణకారము నకారముతోఁ జెల్లునో తెల్పియున్నాఁడు—ప్ర+యాన=ప్రయాణ, అనునది తాదృశణకారమే గాన దానిని దీనితోఁ జోడింపఁ దగదు. కర్ణశబ్దగతణకారమునకును, ప్రమాణశబ్దగతణకారమునకును నెంతో భేదము కలదు. నకారమునకుఁ బ్రాసము కాఁదగుణకారము స్థలాంతరమునఁ దెవ్వుడేని నిరుపాధికమైనప్పుడు తనస్వస్వరూపమును బొంది యుండవలయు ననునది యుండలి పరమార్థము. అట్టిస్థితి కర్ణశబ్దగతణకారమునకున్నట్టులు ప్రాజ్ఞులు భావింపరు, కావున నటదుర్ణయ, దుర్నయగా దిద్దక ఉభయరూపసత్తకు యత్నింప వలయును అందులకు దుస్, దుర్, అనునుభయోపసర్గసత్తయు 'లక్షణప్రతిపదోక్త" పరిభాషయు సాధకములు. ఆయుద్దేశముతో దనే భట్టారకుఁడట్లు ప్రయోగించెను గాని యథేచ్ఛముగా నణలకుఁ ప్రాసము చెల్లింపవలయుఁ నని కాదు. యావత్సుకవి విదితమగు నీవిషయము

న నింతకంటె విస్తరింపవలసినది లేదు. శేఖర
కారునియిటీవలినిష్కృష్టసిద్ధాన్తమునుబట్టి గు
ర్ణయ గతణత్వము నిలువదందురేని, నిలువక
పోయినచో నన్నయనాఁటి కట్టిసిద్ధాన్త ముద
యింప లేదు గాన నతనియుద్దేశమును మార్పఁ
గలదార్ఢ్య మీయిటీవలిసిద్ధాన్తమునకుఁ గలు
గదు. అగుచో నేఁటివా రాప్రయోగము నను
సరింపక శేఖరకారు ననుసరించి ప్రయోగిం
చుకొనుటయే యుక్తమందురా? అది యుక్త
మే కాని, ఈపూర్వపక్షసిద్ధాన్తములు పండి
తు లాయాయాకాలములయం దవిచ్ఛిన్నము
గా జరుపుకొనుచునే యుందురు ఒక రొకప్పు
డు వేఱొకరు మఱొకప్పుడును జయము నం
దుచునే యుందురు. అంతమాత్రమున నశేష
మహాకవి (శ్రీనాథపెద్దనాది) సమ్మానిత మైన
ప్రయోగమునకు క్షతికలుగ నేరదు. వాది
దౌర్బల్యమేగాని వాదదౌర్బల్య ముండనేరదు.
ఆప్రయోగ మేయితర మహాకవిదేని యగుచోఁ
బోఁగలదేమోగాని ఆంధ్రభాషకు మహాభా
ష్యప్రాయ మగుమహాభారతస్థమై యెట్లు పో

యెడిని. పోదు. సంస్కృతకవుల కది యనుస రణీయము కాకపోవచ్చును గాని తెలుఁగు కవిలనువాని కెల్ల ననుసరణీయమగుట కేయు భ్యంతరమును నుండదు. కొంతవఱ కాధార ముగలయీప్రయోగమే తెలుఁగుకవులకనుసర ణీయముకానిచో—

తనమయము, తమమయము, మెదడు ప్రోవులమయము-

లోనగుతిక్కనశంభుదాసులప్రయోగము ల కేసంస్కృత వ్యాకరణమాధారమైగతి గల్పించెడిని. కావున భారతప్రయోగముల విషయమై యెవ్వరును వృథా స్వాతం త్ర్యము నవలంబింప రాదు. ఈ యంశ ము పాశుపతమునఁ గొంత వివరించినదియే. పోనిండు, దుర్ణయ గతణాత్వవిచారము తెలుఁ గులోనిప్రయోగములనుబట్టి మాత్రమే చే యవలసివచ్చిన దని యనుకొనువంటి రేమో అట్లు కాదుసుఁడీ.

(హరివంశమునుండి)

శ్లో॥ కున్నత్యోమమత్పృధ్వస్య దుర్ణయస్య ఫలోదయః॥

ఇక్కడ దిద్దుదు మందురా? మీా రనిన లాభ మేమి? వాచస్పతియట్టిమహాపండితుఁన కే మాత్రము దిద్దుసాహసము లేకయేపోయె నని యెవ రనుకొందురు. ఇట ణత్వము వచ్చుట కొంతవఱకు న్యాయముకాదని వ్రాసెనే గాని యతఁడు దిద్ద సాహసింపలేదు. అతఁడు శేఖరకారకున కిటీవలివాఁడగుటచేత ణత్వసత్త ననుమానింప వలసినవాఁడయ్యె దుర్ణయ, దుర్నయ అనురూపద్వయసత్తను తననిఘంటువునం దంగీకరించెను. అట్లే 'వప్టి అనునిఘంటుకర్తయు నంగీకరించెను. విస్తర మెందులకు. ఈవిచారము సంస్కృతభాషా గ్రంథములయందును నుపలబ్ధముగ నున్నది. హరివంశప్రయోగ మార్షమందురా? అనుఁడు. వాచస్పతి యట్లేల యన లేదో. విచారించి కొనుఁడు వారు త్రొక్కకున్నను మీరు కొత్త త్రోవత్రొక్కి దిద్ది చేసినవిశేష మేమున్నది. అపసిద్ధాన్తమునకుఁ గడంగితిరిగదా? ఈసిద్ధాన్త మింతవఱకు కేలాకుణికునికి సమ్మతమో యొకని పేరెత్తఁగలరా? పైఁగా, ప్రమాణశబ్ద

గతణకారస్వరూప మెఱుఁగనివా రేసిద్ధాన్త
ము కల్పించిన నేమి నిల్చును? వినుఁడు, దుర్ణ
యగతణకారముంబలె నెన్ని శబ్దములయం దెన్ని
సందర్భములు శాస్త్రకర్తలచే ఖండితముల
య్యు ననంతరమహాకవులచేఁ బ్రయోగింపఁ
బడుచున్నవో.

(కావ్యాలఁకారసూత్రములనుండి)

(1) అవతరశబ్దస్య... దీర్ఘత్వ స్యత్యాసో బాలానాం, బాలికానాం ప్రయోగేష్వితి, తే హ్యవతరణ మవ తారఇతి ప్రయుఞ్జతే 'మారుతావతార, ఇతి, స హ్యయుక్తః, భావే తర తేరవిధానాత్ ..."

(2) ముగ్ధిమాదిష్వి మనిజ్ మృగ్యః, ముగ్ధిమా, పాథి కేత్యా దిష్విమనిజ్ మృగ్యః, అన్వేషణీయః.

పైని జూపిన ప్రమాణముల ననుసరించి
రామావతారము, కృష్ణావతారము లోనగు
ప్రయోగము లెల్ల దుష్టము లేకదా. అగుచో

"మాభూ త్పరీవాదనవావతారః"

ఇత్యాది కాళిదాసాది మహాకవుల ప్రయోగ
ములు నన్నయ్యగారి 'దుర్ణయ ప్రయోగము
వంటివే కావలయుఁగదా. ఈ వామనుని

కన్నఁ బ్రాచీనుఁడుగాన కాళిదాసు తనప్రయోగమును దిద్దికొనకున్నను నిటీవలివారేని దిద్దికోవలయునుగదా. అట్టేమహాకవి దిద్దికొనియెనో ప్రమాణ మిచ్చువారు కలరా? అట్లే ప్రౌఢిమ, అనునదియు దుష్టమే కావలయును, అగుచో నీమూకమహాకవి ప్రభృతుల ప్రయోగములగతి యేమి?

శ్లో॥ ఇంధానే భవవీతిహోత్రనివహే కర్మౌఘచండానిల। ప్రౌఢిమ్నా బహుళీకృతే...॥

(మూకపంచశతి-చూ)

అవతారశబ్దమునకుం బలెనే ప్రౌఢిమకును బ్రయోగములు పరశ్శతముండెడి నని యెఱుఁగనివారే లేరు. కావుననే వామనుఁ డనేకశబ్దములంగూర్చి యిట్టిచర్చజరిపిఖండించియున్నను సర్వసామాన్యముగా నుండెడిశబ్దములనే యిందు గైకొని విచారింప మొదలిడుట. ఈ వామనుఁ డెంతవాఁ డనుకొంటిరి, సామాన్యుఁడు గాఁడు. వైయాకరణశిరోమణి యగుభట్టోజీదీక్షితునకుఁ గూడ మాననీయుఁడు.

అవైహీతివృద్ధిలవద్యా (౮౦)
అవైహీత్యత్ర వృద్ధి రవద్యా, గుణఏవయుక్త ఇతి"
(కావ్యాలంకారసూత్రములు చూ)
తేసా వైహీతి వృద్ధిరసాధురేవ
(కౌముది చూ)

ఈ రెంటికిం గలసంబంధమును, వీరిరువుర కాలభేదమును, నెఱిఁగినవారి కీవామనుఁ డెట్టి డో తెలియక పోదు. ఈవామనుఁడు కాశికా వృత్తికర్త యగు వామనునికన్నఁ జాలనిటీవలి వాఁడయ్యు దీక్షితులకన్నఁ జాలఁ బూర్వుఁడని యెఱుఁగఁ దగు, కొన్నిచోట్ల దీక్షితు లితని మతమునకు భిన్నముగాఁ బోయినట్లు స్థూల దృష్టికిఁ గన్పట్టును గాని బాగుగ విచారించిన చో నితని మతము నకించుక యవకాశ మొసఁ గియే దీక్షితులు తన సిద్ధాన్తమును వ్యాపింపఁ జేసెనని స్ఫురింపక మానదు.

(కావ్యాలంకార సూత్రములనుండి)
ఊకారాంతా దఙ్యా ప్రవృత్తేః, ౮౮,
ఊఠ, ఊర్ధ్వైహీతః, ఊకారాన్తాదపి క్వచి ద్భవతి ఆచార్యపరిప్రవృత్తేః, అప్రాణిజాతేశ్చార జ్జ్వాదీనాం, ఇతి అలాబూః, కర్కన్ధూరిత్యుదాహరణం, తేన "గుఖరి

కిం. సంభ్రమేణ అత్ర సుభ్రూశబ్ద ఊఙి సిద్ధో భవతి ఊఙి త్యసతి సుభ్రూరితి స్యాత్॥

ఇట్లు వామనుఁడు సమర్థింపఁగా, దీక్షితులు

కథం తర్హి హా పితః క్వాఽసి హే సుభ్రు ఇతి భట్టిః
ప్రమాదఏవాయ మితి బహవః

అని లిఖించి యున్నాఁడు. ఇట బహవః, అను శబ్దస్వారస్యముంబట్టి చూచిన నితనిని గౌరవించినట్లే స్ఫురించెడిని. ఇది ప్రకృతమున కంత యవసరము గాదు. తేలినసార మిది, దీక్షితునికిఁగూడ మార్గప్రదర్శకుఁ డనఁదగు వామనభట్టుచే నసాధువు లని త్రోయఁబడిన అవతార, ప్రౌఢిమాదిశబ్దములు మహాకవి ప్రయోగారూఢములను హేతువున నెల్లరు నిరాఘాటమున వాడుచుండ హారినాశాదులయందలి యుపలబ్ధింబట్టి యష్టభాషావాగనుశాసనుఁడు ప్రస్థానమున వాడిన దుర్ణయ శబ్దమునందలి ణత్వ మిటీవల శేఖరకారకునిచే ఖండింపబడినను నయ్యది యతనిబుద్ధి వైశద్యమునకే స్ఫోరకమగునుగాని నన్నయ్య ప్రయోగమును భంజింపనేరదు. అతఁడే యాంధ్రకవనమున

కాచార్యుఁ డగుటచే నాంధ్రకవనము చెప్పు ప్రతివానికిని నయ్యది శిరసావహించఁ దగినదే యని వాక్రుచ్చుచున్నారము. అది నన్నయ బుద్ధిపూర్వకముగా వాడినది కాదు. ఇటీవలి వారివలనఁ గలిగిన ప్రమాదము అని దిద్దినచో సమ్మతించి తీరుదుముగాని, అశోత్రవ బాత్త్రిగా నిలువదని ప్రమాణ శబ్దవిచారముచేఁ బ్రాజ్ఞులకు బోధపడి యుండును గాన, భట్టారక ప్రయోగము ణకారఘటితమే యనియు, అతని కీయశాస్త్రీయనణప్రాస మభిమతము కాదనియు నయ్యనఘున కొకటఁ బ్రమాదము చెప్పఁ దగియున్నను నది దుర్ణయ శబ్దమునకు ణత్వము చేయుటలోఁ జెప్పుట యుక్తము కాని యయుక్తనణప్రాసమును సృజించుటలోఁ జెప్పఁ దగదనియు నొక్కి చెప్పుచున్నారము. ఎందులోఁ జెప్పిన నేమని యందురేని వినుఁడు. నన్నయ్య తెలుఁగు నిబంధనల కాచార్యుఁడు కావున నందతఁ డపసిద్ధాంతమునకుఁ బోఁడు నని నుడివినచో నతనియందలి ప్రామాణ్య మనూన్య మెట్లు కాకుండును?

పాణినీయ శాస్త్ర నిష్ణాతత్వమునకో, ఇతనిని మించినవారు పలువురు గలరు. అందుల కితఁడే పరమ ప్రమాణము కాఁడు. కనుక నందుల కంగీకరించుటలో నాక్షేపణ లేదు. ఈతరతను విశేష చర్చ "ఊకాలోజ్ఝ్రస్వదీర్ఘప్లుతః"

అనుచో హ్రస్వదీర్ఘప్లుతం, ప్లుతాః, అను సందర్భమున శాస్త్రబాధ చెప్పుట యుక్తమా లోకబాధ చెప్పుట యుక్తమా! అని విచారించి చేసిన సిద్ధాన్త మెఱిఁగినవారికి హృదయంగమము కాకపోదని సూచించి వదలితిమి.

ఉ॥ భారత మాంధ్రసత్కృతుల పాలిటి పెదము దానవందు
వా। ధ్ధోరణు లెట్టివేని నవి త్రోయఁగ రానివి తప్పులం
మ పా। ధారణరీతి గాఁగ సుకవిత్వము లాడు పరిహా
గజాల మా। భారతమందుఁ గన్పడిఁబండితు లయ్యు
వి స్వీకరింపరే॥

(దేవీభాగవతము, ప్రథమస్కంధము)

మఱియు గొన్ని పద్యములు భారతస్వాతంత్ర్యమునుగూర్చిన వాయీఘట్టమునం దందే చదువఁగోరెదము. ఆయీసందర్భములు మన మూదుంచికొనియే

